# రవాణా సమాచార్

# RAVAANA SAMACHAR

A TELUGU TRANSPORT MONTHLY

సంపుటి 6
సంచిక 12
డిశంబరు
1963



# रवाणा समाचार

సాలుచందా ౩ రూపాయిలు

విడి 25 న.పై ప్రతి

సంపుటి 6

సంచిక 12

ఫోన్ నెం.

1087

రిజిష్టర్డ్ నెం.

A-103




ధరలనదుపులో

ఉంచేందుకు

సహాయపడండి.

*　*　*

దేశరక్షణకోసం

పొదుపుచేయండి.

ఎడిటర్ : జిల్లేపల్లి భాస్కరరావు.

శ్రీ శోభకృత్ నామ సంవత్సర కార్తీక బ॥ పాడ్యమి ఆదివారం 1—12—63

# విచ్ఛిన్న కరశక్తుల ప్రచ్ఛన్న రూపాలు

శాంతి — అభ్యుదయము — సోదరభావము యీ మూడు ఆశయాలు మానవప్రగతికి మూల సూత్రాలు. వ్యక్తిసంస్కృతికి విజయపుమెట్లు. ఏజాతి కోరినా ప్రపంచం వ్యాప్తంగా శాంతి నెలకొనిననాడు అభ్యుదయ ప్రణాళికలు సాగాలనీ, భావిఅభ్యుదయ చిహ్నంగా పరస్పర సోదరభావము సాగి సమానత్వం రావాలని కావాలని. కాని ఔదార్యానికి సమానభావానికి, నిలబడి అభ్యుదయసాధన సాగటంలేదని నిరూపించడానికి భారతభూభాగంపై చైనా, పాకిస్తాను జరిపే సవాల్ తో పాటు అమెరికా ప్రెసిడెంటుగా వున్న కెనడీ మరణం వుదాహరణ కాగలదు. అత్యాచారం జరిపేవారు ప్రచ్ఛన్నంగా వుంటూ స్వేచ్ఛమైన సోషలిజం పేర విచ్ఛిన్నశక్తులను సాగించి అభ్యుదయాన్ని ఆర్పివేసి అశాంతి రేకెత్తించి సోదరభావాన్ని తుదకు ముట్టించివేస్తున్నారు. అట్టి వ్యక్తులవలన కలిగే నష్టాన్ని, కష్టాన్ని భరించి గూడా మానవనిర్మాణ సూత్రమయిన శాంతి, అహింస, సహనాలప్రాతిపదికలపై పనిచేస్తున్న వారిని అభ్యుదయద్రోహులు, అసమర్థులుగా జమకట్టి ఆట ఆడిస్తున్నారు. హీనబలులుగా గు

ంచి దౌర్బల్యానికి గురిచేస్తున్నారేకాని జనహితసూత్రంపై మంచికి మాన్యత కల్పింపజాలకున్నారు. అవకాశవాదులు, అవసరాల అన్నయ్యలు అనేకులు కార్యసాధన పేరుతో కాలం వెళ్ళదీయడానికి పదిమంది శ్రేయస్సు బట్టబయలు చేస్తున్నారు. అంతేగాక తమ మనుగడకు ఆశ్రయభూతమయిన వ్యవస్థలకేదెబ్బతీసి తమ ప్రతిభ వెల్లడింపజూస్తున్నాడు. పోనీ వారి సిద్ధాంతాచరణవలన ప్రపంచానికిగాని యేదయినా మేలుకలిగిందా అని ప్రశ్న వేస్తే ప్రపంచ విచ్ఛిత్తికే వారి కార్యకలాపాలు పునాదిగా మారటానికి సంశయంలేదు.

అయితే యీ మెదుకునడక నడిచేవారు యెవరయి వుంటారు? వారు మాత్రం తక్కువవారు కాదు. భావి అభ్యుదయ మార్గాన్వేషణలో స్థిరమయిన సంకల్పబలంలేక తమ నడకలో ఓడిపోయిన మిడిమిడి జ్ఞానవంతులు - సంఘప్రేమికులుగా బయలుదేరిన వీరి జీవితపోకడ పరిశీలనలో పరివర్తన కలిగించుకోవాల్సి రావటంతో సంఘద్రోహులుగాను, మానవతలేని మనుష్యులుగాను, వర్తించి అభ్యుదయాన్ని విచ్ఛిత్తి కలిగించే ప్రచ్ఛన్న రూపులౌతారు. అంటే అభ్యున్నతికిజరిగే కార్యక్రమంగా క్రమశిక్షణ అలవడని ప్రాంతంలో సామ్యవాద ప్రాబల్యానికి ప్రయత్నం జరిపితే కుంటుబడిన సామ్యవాదశక్తి తంటాలు కూర్చటం నేటిపోకడలోని విశిష్టత. అది పూర్తిగా సమానతను ఆదరింపలేదు. కనుక సాముదాయకంగానయినా లేక వ్యక్తిగతంగా నయినా విభేదాన్నే కోరుతుంది. ఈవిభేదన అవినీతికి అనువర్తనా విధానం తలక్రిందుచేయటానికి, మిత్రద్రోహానికి, మితిలేని అత్యాచారానికి వీలు కలిగిస్తుంది. ప్రజల బాధలెట్లా వున్నా ప్రభుత్వాలు మనుగడ ప్రాధాన్యంతో విచ్ఛిత్తికి ఒగ్గు వహించి గతాన్ని విస్మరించి ఆగతాన్ని ప్రమాదరహితంగా చేసుకొనేందుకు ప్రయత్నిస్తారు. యీ ప్రయత్నంలో కూడా విజయం కలుగవచ్చు, లేక నిష్ఫలం కావచ్చు. కాని ప్రయత్నం మాత్రం తప్పుకాదు.

అదే విధంగా రవాణారంగంలో అభ్యుదయ వాంఛితంగా ప్రణాళికగా సాధనకంటూ పన్నులపెంపకంతోబాటు పన్ను లవసూలు పద్ధతులు సాగించాలని, అందుకు సిబ్బందిని పెంపుచేసి వినియోగపరచటం ప్రభుత్వానికొక అవకాశమయింది. అసలు చట్టాన్ని ప్రయోగించటంలోనే పరిశ్రమ నడకకు అవరోధము కల్పించే ధోరణిలో సాగిస్తూ లోపాయికారీ తాఖీదులవలన కాబోలు అధికారుల ప్రమేయాన్ని అవధులు మించెలాగు చేసి అనవసరమయిన డిమాండ్లు తయారుచేయించి వసూలువిధానాన్ని ఒడుదుడుకుల మధ్య దురుసుతనానికి, దౌర్జన్యానికి దోహదం కల్పించే సాపకాశంతో సాగనిస్తున్నారు. రాష్ట్రవ్యాప్తంగా ఆపరేటర్లు గోలపెట్టినా వినేనాథుడు లేనట్టు. కాకపోతే తానుచేసిన పనిని కాదనే ప్రజల మాటకేం లెక్క అనేధోరణిలో పోతున్నట్లుందిగాని ప్రజాక్షేమం ప్రణాళికాధ్యేయం చెడకుండా చట్టం ఉద్దేశింపబడిన విధంగా అను-

వర్తింపబడుతూందా అనే గమనికి కనుపించ నందున యీనాడు రోడ్డురవాణా పరిశ్రమ తెలుగురాష్ట్రంలో తల్లక్రిందు కాగలదనే అనుమానం కలుగుతుంది. కేంద్రప్రభుత్వంవారు రవాణా సాధనాలన్నిటిలో రోడ్డురవాణా పొదుపునకు శీఘ్రగమనానికి సరాసరి ప్రయాణానికి పెట్టింది పేరుగా గుర్తించి అభివృద్ధి పథకాల ననేకం అమలుజరపాలని ట్రాఫిక్ సర్వేలు జరిపిస్తూ అంత రాష్ట్రరవాణా సౌలభ్యంతోబాటు రాష్ట్రాంతర రవాణా నుద్దేశించి మోటారుబండ్ల చట్టాన్ని వీలున్నంతవరకు సవరించి సదుపాయాన్ని కలుగజేస్తుంటే మన రాష్ట్రంలో అనువర్తనా విధానం లోపభూయిష్టంగావుంటూ కుంటుతనాన్ని,కొంటెతనాన్ని కల్గివున్నదనిగుర్తించిన పరిశ్రమదారులపని హృదయవిదారకంకాగలదు. మానవ నైజాన్ని మార్చగల పరిస్థితులను మనం యింకా పొందలేదుగనుక దుర్గంధం వచ్చేవీధిలో మంచిగంధపుపూత ఎంతవరకు పనిచేస్తుందని ప్రశ్నించే ముఖ్యమంత్రిగారి సలహా గుర్తిస్తే అవినీతి నాసరాగా చేసుకోకపోతే పరిశ్రమదారులు తమ దైనందిక కార్యకలాపాలు సాగించలేరని చెప్పక చెప్పచ్చు. చాలమంది పరిశ్రమదారులు, పరిశీలకులు చివరకు ప్రభుత్వం కూడా చట్టాన్ని ఎమెండుచేసి సులువుమార్గాలు చూడాలంటారు. కాని వర్తింపబడే చట్టం సక్రమంగా సాగుతున్నదా అన్న ప్రశ్న ప్రభుత్వరంగంలో ఏస్థాయిలోను జరగటంలేదని చెప్పొచ్చు. కాకపోతే అవస్థపడే మనిషి తెలిపేవిషయాలను విచారించే పైవారు వివరిస్తూ క్రిందవారిని సమర్థింపచూస్తారేగాని యదార్థానికి గుర్తింపు కలుగని కారణాన విచ్ఛిన్నకరశక్తుల ప్రచ్ఛన్న రూపాలు చట్టాలు తయారుచేయటం మొదలు అనువర్తింపబడేవరకు గోచరిస్తుంటాయి. మంచి ప్రక్కన చెడు,నలుపు ప్రక్కన తెలుపు వుంటూవుండి పరస్పరం గుర్తింప బడుతున్నట్లు అభ్యుదయం ప్రక్కన ప్రచ్ఛన్నకరశక్తి కానవస్తూ వుంటుంది. కాకపోతే కట్టడి, సహనము, త్యాగము, గల మేధస్సులు తమ ప్రవర్తనవల్ల విచ్ఛిత్తికి దోహదం కల్పించకుండా నిబ్బరం ప్రదర్శించటం వలన అభ్యుదయమార్గాలే సాగిపోగలవు. ఈ గుర్తింపు సాగినడిస్తే ఏచట్టమైనా ప్రజాహితకరంకాగలదు. ప్రపంచ వ్యాప్తంగా ప్రభుత్వాలు మానవాళి యీ నగ్నసత్యాన్ని గమనించి ప్రచ్ఛన్నరూపంలో ప్రకోపించే విచ్ఛిన్న కరశక్తుల నరికట్టేందుకు ప్రయత్నించాలి. లేకుంటే న్యాయం, ధర్మం, సంఘం పేరుతో మానవాళికి మారణహోమం సాగి ప్రభవింపవలసిన పరిశ్రమలు పతనమయి అభ్యుదయం అంతరించిపోగలదు. ♦♦♦

## మనవి

రాబోయే క్రొత్త సంవత్సరం 1964 లో రవాణా సమాచార్ పత్రిక పొందగోరే వారందరు వారివారి చందాలను ముందుగా చెల్లించాలని ప్రార్థన. పరిశ్రమదారులు, పనివారు,ప్రభుత్వం వారు తమసహకారాన్ని కొఱతపరచకుండా సాగిస్తూ పత్రిక భవితవ్యానికి దోహదం కలిగించాలని ప్రార్థన. ప్రకటన కర్తలు చూపుతున్న ఆదరాభిమానాలకు మా ధన్యవాదాలు అర్పిస్తూ యికముందుకూడా అట్టిసహకారాన్ని అందజేయ గలరని ఆశిస్తున్నాము.

—ఎడిటర్.

# అమరుడైన చెన్నుపాటి.

కృష్ణాజిల్లా ప్రాంతంలో చెన్నుపాటి రామకోటయ్యగారిని ఎరుగనివా రుండరు. ముఖ్యంగా రోడ్డురవాణా రంగంలో ఆబాలగోపాలమూ ఆయనకు పరిచయులే. చిన్ననాటినుండి రామకోటయ్య కష్టపడి అభివృద్ధిని సాధించిన మనిషి. పట్టుదల, దిట్టతనం ప్రాధాన్యంగా కృషి లోపాన్ని ఆపాదించడానికి వీలులేని వ్యవహారపు పోకడలో చదువుసంధ్యలు యెక్కువలేకున్నా సంఘనిర్మాణంలోను, సాముదాయిక జీవనంలోను సంస్కృతి సంపాదించి నలుగురిచేతా మంచి అనిపించుకుని అసెంబ్లీ స్థానానికి అర్హత సంపాదించాడు. పనివాడుగా పైకి వచ్చిన రామకోటయ్య పదిడబ్బులు చేరినతరువాత కూడా పాత బాంధవ్యాన్ని వదలి పైచూపు చూడక పదిమంది మంచినే తన ప్రాభవంగా భావించి పాక్షికదృష్టికి గురికాక ప్రజాసేవకుడయ్యాడు. పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగా వూరికట్టడి నేర్పరచి ప్రజాసౌకర్యాలను పెంపొందిస్తూ ప్రజల జీవనాన్ని ఫలవంతము ఆదర్శవంతముగా రూపొందించడానికి ఆధునిక విధానాలనేకము ఆచరించాడు. ఆర్తితో వచ్చిన ప్రతివానిని ఆదరించి ఉచితరీతిని విధానాచరణ కర్తవ్యతా బోధ గరిపి పంపించగలిగాడు. తనపక్షాన్ని, ఎదిరిపక్షాన్నికూడా సమానంగా గుర్తించి గౌరవింపగల హృదయసౌలభ్యం కలిగినవాడు. అంతేగాక పేచీజీవితానికి దూరంగా పోతూ ప్రతి తేడాను సంప్రదింపులద్వారా స్థిరత సాధించడానికి దారులు వెతికేవాడు. ప్రజల మనిషిగా బ్రతికిన చెన్నుపాటి రామకోటయ్య యీనాడు మన మధ్య లేడు. దీపావళినాడు దేదీప్యమానంగా ఆశయాల అంపశయ్యపై విధినిర్వహణ విడనాడక మాట్లాడుతూ, మాట్లాడుతూ సునాయాసంగా మనలను వీడి అనంతశక్తిలో లీనమయినాడు. ఆయన లేనిలోటు అనేకంగా మనలను, మననాయకులను బాధపెట్టింది. వారికుటుంబానికి మా పత్రికాముఖంగా సంతాపం తెలియచేస్తున్నాము. ఈనాటికీ మా చెన్నుపాటి మా మధ్యనే బ్రతికివున్నాడు. ఆయన నేర్పిన విధానాలు, చూపించిన ధైర్యసాహసాలు రవాణారంగంలో అభివృద్ధి మార్గాల అన్వేషణలో అతి ముఖ్యమయిన ఘట్టాలు. అమరుడయిన చెన్నుపాటి మాకారాధ్యుడు.

ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక!

—ఎడిటర్.

## కర్నూలుజిల్లా గవర్నమెంటు బస్సులలో అక్రమాలు - అవినీతి.

1964 సంవత్సరంలో జరుగనున్న పంచాయితీ యెన్నికలలో ఏకగ్రీవంగా యెన్నికయిన పంచాయితీలకు రు 5000/- బహుమానంగా యివ్వాలని తిరుపతిలో చేసిన తీర్మానాన్ని బలపరుస్తూ కర్నూలు జిల్లాపరిషత్తు సాధారణ సమావేశంలో ఏకగ్రీవంగా తీర్మానించారు.

కర్నూలు జిల్లాలో జాతీయంచేసిన ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణా సంస్థ బస్సులు సక్రమంగా నడవటంలేదని, అవినీతి, లంచగొండితనం పెరిగిందని, అందువలన ప్రభుత్వం దొంగతనాన్ని అరికట్టేందుకు సి.ఐ.డి లను నియమించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

స్వల్ప ఆదాయం కల ఉద్యోగుల గృహ వసతి క్రింద రెండులక్షల 56 వేలు రుణం యివ్వాలని ప్రభుత్వాన్ని కోరారు.

జిల్లాలో రోడ్డు రవాణా సంస్థ నడిపే బస్సుల లోపాలు, కండక్టర్ల ప్రవర్తనలు, ఆలస్యానికి కారణాలు; దారిలో బస్సులు ఖాళీగావున్నప్పటికీ నిలపడంలేదని ఆరోపించారు. ఆదోని నుండి గూల్యం, గూల్యంనుండి ఆదోనికి వెళ్ళే బస్సు యింగడహాల్ ద్వారా వెళ్ళడంలేదని; వారి యిష్టప్రకారం వెళ్ళడం. టిక్కెట్లు యివ్వకుండా వుండటము జరుగుతున్నదని విమర్శించారు.

కర్నూలు జిల్లాలో ఆర్. టి.సి బస్సులవలన ప్రయాణీకులకు యెక్కువ సౌకర్యాలు కలుగుతాయని ఆశించారు. కాని చాల అవకతవకలు జరుగుతున్నవి. అంతేగాదు కండక్టర్లు బయలుదేరేముందు వారికి యిచ్చేసొమ్ము ఒకమొత్తానికి వ్రాసుకునే రశీదు మరొక మొత్తానికి వుంటున్నదని, యిలా అవినీతిని కార్యాలయ సిబ్బంది నేర్పుతున్నట్లు, దానివలననే ప్రస్తుతం ఆర్.టి.సి కి దాదాపు మూడులక్షలు రూపాయలు నష్టమొచ్చిందని తెలిపారు. యిదివరలో ప్రయివేటు ఆపరేటర్లు లాభాలు పొందితే, మరి ఆర్.టి.సి నష్టానికి కారణమేమిటో పరిశీలించకుండాప్రజాసహకారంలేదనడంలో అర్థంలేదు.

ప్రజాసహకారమంటె బస్సులలో అక్రమము,అవినీతి,అన్యాయం జరిగితే రిపోర్టు చేసేంతవరకే గాని, బస్సు చెడిపోతే పనులు చేయడము కాదు. ప్రతివారికి ప్రజా సహకారం లేదనడము పరిపాటయిపోయినది. ప్రజాసహకారాన్ని పొందడానికి ప్రజలకుసౌకర్యాలు కలుగచేసినపుడే వస్తుంది.

### రోడ్డురవాణా సంస్థ నిర్వహణ.

రోడ్డురవాణా సంస్థ నిర్వహణ నిమిత్తం రాష్ట్రాన్ని మండలాలుగా విభజించే ప్రతిపాదనను విరమించుకున్నట్లు రవాణామంత్రి బి వి గురుమూర్తి నేడు శాసనసభలో తెలియచేశారు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు వేసిన ప్రశ్నకు ప్రత్యుత్తరంగా శ్రీ గురుమూర్తి యింకా యిలా అన్నారు. ప్రస్తుతము అమలులో వున్న డివిజనల్ కార్యాలయాల పద్ధతి వచ్చి అట్టేకాలం కాలేదు. యిదే యింకాకొంతకాలం అమలులో వుండాలని రవాణాసంస్థ అభిప్రాయపడింది.

### ట్రాక్టర్లు కొనటానికి ఋణాలు.

అద్దె, కొనుగోలు పద్ధతిపై ట్రాక్టరులు కొనుక్కొనేందుకు రైతులకు ఋణాలుయివ్వటానికి కేంద్రప్రభుత్వం 330 లక్షలు మంజూరు చేసిందని, 261 దరఖాస్తులు రాగా 18 మందికి ఋణాలు మంజూరు అయినాయని వ్యవసాయ మంత్రి ఎ. బలరామరెడ్డి ఒక ప్రశ్నకు జవాబుగా తెలిపారు.

వివిధ జైళ్ళలో ఖైదీలు తయారుచేసిన వస్తువులు అమ్మగా 1962–63 లో 7,70,363 రూపాయలు ఆదాయం వచ్చిందనీ, దీనికి మించు మతె ఖర్చు అయింది 6 03,930 రూపాయలని సమాచారమంత్రి పి వి నరసింహారావు వేరొక ప్రశ్నకు సమాధానం చెప్పారు

### ఎండుచేపలఎగుమతి

స్థానిక అవసరాలకు తగినన్ని ఎండుచేపలు రాష్ట్రంలో లభిస్తున్నా, వ్యాపారస్తులు మహారాష్ట్రం నుండి వాటిని దిగుమతి చేస్తున్నారని వ్యవసాయమంత్రి వేరొక ప్రశ్నకు జవాబిచ్చారు. మత్స్యపరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వం చేస్తున్న సహాయాన్ని వివరించి జీఫ్‌సీఫిషింగ్ కార్పరేషన్‌ను స్థాపించాలని అనుకుంటున్నారని కూడా ఆయన చెప్పారు.

### ఆర్.టి.సి కండక్టర్ల, డ్రైవర్ల సమ్మె చట్ట విరుద్ధమని విమర్శ.

రోడ్డురవాణా కార్పొరేషను కండక్టర్లు, డ్రైవర్లు నవంబరు ఐదవ తేదీన చేసిన ఆకస్మికసమ్మె చట్టవిరుద్ధమని సిటీ కాంగ్రెసునాయకులు నిన్న విమర్శించారు. శ్రీయుతులు బి. రాందేవ్, ఎర్రం సత్యనారాయణ, పండిట్ నరేంద్రజీ, మహమ్మద్‌అబ్దుల్‌ఖాదర్ ఒక పత్రికాప్రకటన చేశారు. నవంబరుఅయిదవ తేదీన రోడ్డురవాణా కార్పొరేషన్ కండక్టర్లు,డ్రైవర్లు చేసిన ఆకస్మిక సమ్మెను వీరు నిరసించారు. ఈ సమ్మెవలన నగరవాసులకు అసంతృప్తి కలిగిందనీ, రెండు లక్షలమంది పురజనులకు, పాఠశాలలకు వెళ్ళే విద్యార్థులకు,ఉద్యోగులకుఆరోజున పెద్దయిబ్బంది కలిగిందని పేర్కొన్నారు. కండక్టర్లు విద్యార్థులపట్ల మైత్రీభావంతో మెలగవలెనని నాయకులు విజ్ఞాపన చేశారు.

### బైలదిల్లా - విశాఖ రైలుమార్గ నిర్మాణం.

మధ్యప్రదేశ్‌లోని బైలదిల్లాను విశాఖపట్టణానికి కలుపుతూ నిర్మించే 280 మైళ్ళ పొడవు రైలుదారి నిర్మాణం అనుకున్నదానికంటె ముందుగానే పూర్తికాగలదు. మొదట్లో యీ రైలుమార్గం నిర్మాణం 1966 జనవరి 1 వ తేదీకి పూర్తికాగలదని లక్ష్యంగా పెట్టుకున్నారు. ఈ రైలుమార్గం నిర్మాణం పూర్తిఅయితే 60 లక్షల టన్నుల కాకిరాయి ఎగుమతి చేసేందుకు వీలుపడుతుంది

కేంద్ర రైల్వేశాఖ ఉపమంత్రి శ్రీ ఎస్.వి రామస్వామి యీ రైలుమార్గము నిర్మించబడుతున్న కొండప్రాంతంలో యిటీవల పర్యటించి వచ్చారు.

యీ రైలుమార్గం నిర్మాణం పూర్తిఐతే అహర్నిశలు ఈ నిర్మాణంలో పాల్గొన్న యువ

యింజనీరుల ఘనతకు యిది నిదర్శనం కాగలదని ఆయన చెప్పారు. కొత్తవలస – బైలదిల్లా మార్గంలోని ప్రాథమికదశలోగల కొన్ని ప్రాంతాల ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుంది ఈ మార్గము రామగుండం, కొత్తగూడెం వరకు పొడిగించబడే అవకాశం వున్నది.

60 లక్షల టన్నుల కాకిరాయి యెగుమతి వలన నికరంగా 30 కోట్ల రూపాయల విదేశ మనకు ద్రవ్య లభించగలదని భావించబడుతున్నది. యీ రైలుమార్గం బొకారో కర్మాగారానికి కూడా సహాయపడుతుంది.

## తంతి-తపాలా సిబ్బందికి ఓవర్‌టైమ్ భత్యం

పోస్టల్ వుద్యోగులకు "ఓవర్ టైమ్" భత్యాన్ని ముట్టచెప్పే ఏర్పాట్లు త్వరలోనే జరుగగలదని కేంద్ర తంతితపాలామంత్రి ఏ.కె సేన్ నేడు యిచ్చట అఖిలభారత పోస్టల్ ఉద్యోగుల (3వ తరగతి) సప్తమవార్షిక మహాసభను ప్రారంభిస్తూ వెల్లడిచేశారు.

రెండవ వేతనసంఘం యిట్టి సిఫార్సును చేయకపోయినా కేంద్రప్రభుత్వం ఉద్యోగులకు ఈ భత్యాన్ని యేర్పాటుచేయదలచింది." అని ఆయన యీ సందర్భంలో తెలియచేశారు.

గృహవసతులను గూర్చి తంతి తపాలా వుద్యోగులు వెలువరిస్తున్న కోర్కెలను గురించి మాట్లాడుతూ ఈ విషయంలోకూడా ప్రభుత్వము కొంత సుముఖంగా వ్యవహరించగలదని, యీ వుద్యోగులకు సంబధించిన గృహవసతి పథకానికి ఒకదానికి ప్రభుత్వం ప్రాధాన్యము యిచ్చి ఆలోచిస్తున్నదని శ్రీ సేన్ చెప్పారు.

యిన్‌స్పెక్టరుల జీతాలను పెంచడాన్ని గూర్చి వస్తున్న సూచనలను పరిశీలించవలసిందిగా తంతితపాలా బోర్డువారిని కోరామనికూడా సేన్ చెప్పారు.

యిది యిలా వుండగా రవాణా శాఖ ఉపమంత్రి శ్రీ బి.భాగవతి నేడు యిచట పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ మూడవప్రణాళిక కాలంలో నెలకొల్పాలనుకున్న 20 వేల పోస్టాఫీసులను ప్రణాళిక వ్యవధిలోగా నెలకొలపడం సుసాధ్యము అవుతుందనే అనిపిస్తున్నదని, యింతవరకు 10 వేల పోస్టాఫీసులను నెలకొల్పడం జరిగిందని, యిక మిగిలిన ప్రణాళికాకాలంలో తక్కిన 10 వేల పోస్టాఫీసులను నెలకొల్పడం జరుగుతుందని చెప్పారు.

నాలుగవ ప్రణాళికాకాలంలో గ్రామాలలోను, వెనుకబడి ఉన్న ప్రాంతాలలోను ఆదివాసి ప్రాంతాలలోను అధికం తంతి తపాలా కార్యాలయాలను ప్రారంభించాలని ఆలోచనలు జరుగుతున్నాయని శ్రీ భాగవతి తెలియచేశారు.

తంతితపాలా ఉద్యోగులతోను అధికారులతోనూ, సమిష్టి సంఘాలను ఏర్పాటు చెయ్యాలన్న ప్రతిపాదనను రవాణాశాఖ సూత్రప్రాయంగా అమోదించిందని, త్వరలోనే ఈ విషయాన్ని గూర్చి కార్మిక సంఘాలతో త్వరలో ఆలోచించగలమని కూడా శ్రీ భాగవత్ తెలియచేశారు.

యీ సంఘాలు వట్టి సలహాసంఘాలు కావు. ఉద్యోగుల కష్టసుఖాలను గురించి, సమస్యలను

గురించి ముఖ్యమయిన నిర్ణయాలు చేయగల అధికారం యీ సంఘాలకు వుంటుంది. యీ సంఘాలలో తేలని విషయాలు అంటూ వుంటే, వాటిని పరిష్కరిస్తృత్వానికి పంపడం జరుగుతుంది" అన్నారు.

## హైదరాబాద్ నగరంలో ఆర్. టి. సి. సమస్యలు.

హైదరాబాద్ నగరంలో రవాణా, రవాణా ఆర్థిక వ్యవహారాలు తీవ్రమయిన సమస్యలుగా యెదురయినవని రోడ్డురవాణా కార్పొరేషన్ చీఫ్ ఎక్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ వి. పి. రామారావు యిక్కడ పేర్కొన్నారు.

ఆర్.టి.సి పనివారల యూనియన్ హైదరాబాద్ నగరశాఖ సర్వసభ్య వార్షిక సమావేశానికి ప్రతాపగిరి కోఠీలో శ్రీ రామారావు ప్రారంభోత్సవం చేశారు. యింతవరకు సిటీసర్వీసుకు నష్టంవస్తున్నదని, యెంతమేరకు ఈ నష్టం భరించవలసివుంటుందనే సమస్యను పరిశీలించవలసి వుంటుందనీ, బస్సులసంఖ్యను హెచ్చించే విషయాన్ని కూడా యోచించవలసి వుంటుందని ఆయన పేర్కొన్నారు.

నగరంలో నడుపుతున్న బస్సులస్థితి చాలా వరకు అధ్వాన్నంగా వున్నదని శ్రీ మక్దుం మొహియుద్దీన్ తెలియజేశారు.

శ్రీ పి. వెంకటేశ్వరరావు సమావేశానికి అధ్యక్షత వహించారు. 150 మంది సమావేశానికి హాజరయారు.

## హైదరాబాదు టెలిఫోన్ సంస్థలో ఏర్పాట్లు.

జిల్లామేనేజర్ వివరణ.

బిల్లులును ఖాతాలనుతయారుచేసి చందాదారులఖాతాలకుసంబంధించిన యే సమస్యనయినా నిమిషాలమీద పరిష్కరించగల కట్టుదిట్టమయిన నాన్ని దేశం మొత్తంమీద ప్రప్రథమంగావిధం హైదరాబాదు టెలిఫోన్సు సంస్థ ప్రవేశపెట్టింది.

టెలిఫోన్ జిల్లా మేనేజరు శ్రీ ఎస్.జి.కె. రెడ్డి పత్రికాప్రతినిధులగోష్టిలో యీ సంగతి చెప్పారు. ఆయా తేదీలలో చెల్లించబడిన బిల్లుమొత్తాలు, మీటర్ రీడింగులు స్థానిక పిలుపుల ఛార్జీలు మొదలయిన వివరాలతో ఈ కొత్తపద్ధతి ద్వారా ప్రతి చందాదారులకు వ్యక్తిగతంగా ఖాతాలు నిర్వహిస్తున్నామని కూడా తెలిపారు.

చందాదారులకు కావలసిన యే సమాచారమయినా కొద్దినిమిషాలలో యివ్వగలం" అని ఆయన పేర్కొన్నారు.

టెలిఫోను అద్దె బిల్లులను ప్రతినెల మొదటి వారంలోను ట్రంకు, ఫోనోగ్రాము బిల్లులను ప్రతినెల 14 వ తేదీన పంపుతున్నామని, దేశములో మరెక్కడా యింతచురుకుగా ఈ పనులు జరగటం లేదనీ శ్రీ రెడ్డి తెలియజేశారు

ఈ సంవత్సరం డిశంబరు 15 వ తేదీనాటికి హైదరాబాదు జిల్లాలో 11000 టెలిఫోన్ లైన్లు ఉండగలవనీ, వీటిలో 1500 లైన్లు కొత్తగా ఏర్పాటు చేయబడినవనీ ఆయన చెప్పారు.

రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ చైర్మను శ్రీ కటారి ఇక్కడ విజ్ఞప్తి చేశారు.

కార్పొరేషను పనివారల యూనియను పదకొండవ వార్షిక సమావేశంలో శ్రీ కటారి ప్రసంగిస్తూ అటువంటి పరిస్థితులకు అవకాశం ఇవ్వకుండా పనివారలు వ్యవహరించాలని కోరారు.

ఒక కండక్టర్‌పై దాడి జరిగిందన్న వదంతి వ్యాప్తి కావడంతో, నగరంలోని సిబ్బంది పనిని మానివేయడం సంభవించిందని, వెంటనే పనిలోకి చేరాలని కార్పొరేషన్ అధికారులు కోరగా పొరపాటు చేసిన వారిపై ఎట్టిచర్య తీసుకోరని, హామీయివ్వాలని పనివారలు కోరారని పొరపాటు చేసిన వారిని శిక్షిస్తారనే భయం ఏర్పడిందంటే, పొరపాటు జరిగినట్టు గుర్తించినట్టు తోస్తుందని ఆ విధంగా పనివారలను పెడదారిని పెట్టిన వారు పనివారలకు, యాజమాన్యానికి తీరని అపచారం చేసిన వారయారని చైర్మన్ వివరించారు.

పనివారలు హక్కులతోబాటు, బాధ్యతలను కూడా గుర్తెరిగి వ్యవహరించేటట్టు యూనియన్ చూడాలని సలహా ఇచ్చారు.

ప్రమోషన్‌ల విషయం ప్రస్తావిస్తూ, ప్రతిభ లేనిదే, సీనియారిటీ ఒక్కటే చాలదని పేర్కొన్నారు. నూటికి నూరుశాతం సమర్థతను పెంపొందించడానికి నిర్విరామ కృషి జరగాలన్నారు.

=*=

కొత్తరైల్వే జోన్ కేంద్రం మైసూరులో నెలకొల్పడం ఆంధ్రులకు తీరని నష్టం.

కొత్తరయిల్వేజోన్ కేంద్రాన్ని సికింద్రాబాద్‌లో కాకుండా మైసూరులో ఉంచాలనే ప్రతిపాదన ఆంధ్రులకు అత్యంత ప్రమాదకరమైనదని సాంబమూర్తి పార్కులో ఆదివారం జరిగిన సభలో హెచ్చరించారు.

ఆంధ్రకు ప్రత్యేకరయిల్వేజోన్ ఏర్పాటుచేసే ప్రతిపాదన ప్రస్తుతం తీవ్రంగా పరిశీలింపబడుతున్నదని, తూర్పుగోదావరిజిల్లా ప్రయాణీకుల సంఘానికి రయిల్వేశాఖమంత్రిఅంతరంగిక కార్యదర్శి 6 వ తేదీని లేఖ వ్రాశారు. ఆ లేఖ యీ సభలో చదవబడింది.

రాష్ట్ర రహదారులమంత్రి మీర్‌అహమద్ అలీఖాన్ క్రొత్త రయిల్వేజోన్ విజయవాడ, గుంటకల్లు, సికింద్రాబాద్, షోలాపూరు మండలాలలో ప్రారంభించడానికి కేంద్ర రయిల్వేమంత్రిత్వశాఖ అంగీకరించినదని యిక్కడ జరిగిన సభలో ప్రకటించారని కానీ ప్రస్తుత రైల్వేలశాఖమంత్రి మైసూరు ప్రాంతీయుడైనందున, యీ క్రొత్త రైల్వేజోన్ కేంద్రం సికింద్రాబాద్‌లో వుండకుండా మైసూరులో వుండే ప్రయత్నాలు జరుగుతున్నాయనీ ఇదే నిజమయితే దీనిని ఆంధ్రులంతా వెంటనే మేల్కొని తీవ్రంగా ప్రతిఘటించాలనికూడా హెచ్చరించారు.

లోకనాథం రిపోర్టు.

ఆంధ్రరాష్ట్రంలో మూడవ ప్రణాళికా

కాలంలో కొత్త రైల్వే లైను ఒకటైనా నిర్మింపబడలేదనీ, మైసూరు, మద్రాసు, కేరళ ప్రాంతాలకీ విషయంలో అత్యంత సౌకర్యాలు చేకూర్చబడ్డాయని విమర్శించారు.

## మీటర్ గేజ్ మార్పు.

మచిలీపట్నం – హుబ్లీల మధ్య గుడివాడ–భీమవరముల మధ్య వుంటున్న మీటర్ గేజిని, బ్రాడ్ గేజిగా మార్చడం కేవలం తమిళుల లాభాల కనుగుణంగా వుండేనిమిత్తం జరిగిందే అని కూడా ఆయన విమర్శించారు.

ఈ విషయమొకటి మినహాగా లోకనాథన్ రిపోర్టులో పేర్కొనబడినమరేవిషయం ఆంధ్రుల విషయంలో అమలుజరుగలేదని కూడా గట్టిగా విమర్శించి ఆ రిపోర్టు విస్మరింపబడినందుకు తీవ్రంగా గర్హించారు.

## సత్యాగ్రహం.

మెయిన్‌లైన్ కాకినాడమీదుగా మార్పించడానికి ఇక సత్యాగ్రహమే శరణ్యమని అన్నారు.

## రైలురోడ్డు బ్రిడ్జి.

గోదావరిపై రైలురోడ్డు వంతెన నిర్మాణానికై యాభై లక్షల రూపాయలు రాష్ట్రప్రభుత్వం కేటాయించింది కనుక దాని నిర్మాణం వెంటనే ప్రారంభించాలని, రైల్వేజోన్ యీ సాలులోనే ప్రారంభించాలని రైల్వేమంత్రికి నచ్చచెప్పటానికి రాయబారం జరపాలని సభ తీర్మానించింది.

# గోదావరిపై రైలు - రోడ్డు వంతెన నిర్మాణం.

## రాష్ట్రప్రభుత్వానికి రైల్వేల ఉపమంత్రి రామస్వామి సలహా.

గోదావరినదిపై రోడ్డు – రైలు వంతెన నిర్మాణములో రాష్ట్ర ప్రభుత్వము తమ వాటాను పూర్తిగా భరించుటకు వెనుకాడవలసిన అవసరము లేదని, పంజాబు మున్నగు రాష్ట్రములలో మాదిరిగా ఈ రోడ్డు–వంతెన వద్ద టోల్ సుంకాన్ని వసూలు చేయవచ్చునీ, రైల్వేల ఉపమంత్రి శ్రీ ఎస్. వి. రామస్వామి చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ను విశాల ప్రాంతములో రైలు మార్గాన్ని వేయుని విషయాన్ని ఆయన అంగీకరించారు.

పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ శ్రీ రామస్వామి ఇలా చెప్పారు : "నాల్గవ ప్రణాళికలో విజయవాడ – మద్రాసు మధ్య రైల్వేమార్గాన్ని విద్యుదీకరణ చేసే ప్రతిపాదన పరిశీలనలో వుంది. అందుకు అవసరమైన విద్యుత్‌ను సరఫరా చేసేందుకు ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఇటీవల దక్షిణప్రాంతీయ మండలిలో అంగీకరించారు.

ఇక గోదావరిపై 16 అడుగులు వెడల్పు గల వంతెనను నిర్మించవచ్చు. రైలు వంతెనకు రూ 6 కోట్లు. రోడ్డు వంతెనకు $1\frac{1}{2}$ కోట్లు ఖర్చు అవుతుంది. రోడ్డు వంతెన ఖర్చును రాష్ట్రప్రభుత్వము ప్రణాళికా సంఘము నుండి ఋణము తీసుకోవచ్చును. ఇక్కడ టోల్ సుంకము వసూలు చేసి ఆ ఋణాన్ని

తీర్చి వేయవచ్చును. రైల్వే వంతెన 1967 వరకు పూర్తికాదు గనుక రోడ్డువంతెన ఖర్చును మూడు, నాలుగు ప్రణాళికలు రెంటిలోను ఏర్పాటు చేసుకోవచ్చు. అయితే ఈ వంతెనకు అవసరమైన ఉక్కును దిగుమతి చేసుకోవలసి వున్నందున రోడ్డు వంతెన నిర్మాణముపై భారత ప్రభుత్వము వీలైనంత త్వరలోతన నిర్ణయాన్ని తెలియజేయవలసి వుంది. ఆలస్యము చేస్తే రైల్వే వంతెనకు కావలసిన ఉక్కు దిగుమతికి ఏర్పాటు చేసుకోవలసి వుంటుంది.

మధ్య ప్రాచ్య రైల్వే మండలము ఏర్పాటు గురించిన ప్రశ్నకు సూటిగా సమాధానము ఇవ్వకుండా కొత్త మండలాలుఏర్పాటు చేయుటకు పనిభారము, పరిపాలనా సౌలభ్యము పరిగణనకు వస్తాయని ప్రస్తుతము దక్షిణ రైల్వేకి పని భారము హెచ్చుగా వుందని, ఇది అయిదు రాష్ట్రాలను కలుపుతూ ఆరువేల మైళ్ళు నిడివి వుందని ఈ యదార్థాన్ని ఎవరు కాదనలేరని శ్రీ రామస్వామి చెప్పారు. అయితే ఈ పని భారము తగినస్థాయిలో వున్నది, లేనిది ఎప్పటికప్పుడు పరిశీలిస్తున్నట్లు, ఇది ఇంకాపరిశీలనలో వున్నట్లు నిర్ణయం తీసుకొనడానికి కొంత వ్యవధి తీసుకుంటుందని అన్నారు.

రాష్ట్రంలో కొత్త రైల్వే మార్గములు గూర్చి ఇలా చెప్పారు: కొత్తగూడెం బొగ్గు గనులకు మధ్య రైల్వే అనేక బ్రాంచి మార్గాలను ఏర్పాటు చేస్తున్నది. కొత్తగూడెంథర్మల్ కేంద్రమునకు రోజుకు సుమారు 800 వాగనులు సరఫరా చేయవలసివుంది.

కొత్త వలస — భద్రాచలంరోడ్డు, ఒంగోలు లేదా నెల్లూరు నుంచి నాగార్జున సాగర్ మీదుగా ఖాజీపేటకు, హైదరాబాద్ నుంచి విశాఖపట్నమునకు కొత్త మార్గములను వేయాలని రాష్ట్ర ప్రభుత్వము సిఫారసుచేసింది. నాగార్జున సాగర్‌ను రైల్వే మార్గముతో ఏ విధంగానైనా కలుపక తప్పదు. కొత్తవలస - భద్రాచలం రోడ్డు మార్గము బొగ్గు గనులను కలుపుతున్నందున పరిశీలించదగినదే. ఇది 120 మైళ్ళు కొండప్రాంతముల ద్వారా పోతుంది. ఇంద్రావతి నదిపై వంతెన నిర్మాణము జరుగవలసి వుంటుంది."

రవాణా పరిస్థితిని వివరిస్తూ 120 వాగనుల రైలుకు మూడు డీసెల్సు ఏర్పాటు చేసి దాని ద్వారా 7 వేల టన్నుల సరుకు రవాణా చేసే అవకాశముందని శ్రీ రామస్వామి అన్నారు.

కృష్ణమీద రెండవ వంతెన వచ్చే ఏడాదికి పూర్తి కావడముతో రోజుకు 150 రైళ్ళు ఇటూ అటూ ప్రయాణం చేస్తాయి. ఇప్పుడు విజయవాడ మినహా 2400 బి. జి. లోను 300 మీటరు గేజిలోను వాగనులకు బియ్యం సరఫరాకు ఇండెంట్లు వున్నాయి. దేశము మొత్తము మీద చూస్తే 80వేల వాగనులకు ఇండెంట్లు వున్నాయి. ఇదంతా రైల్వే శాఖకు ఒకరోజు రవాణాతో సమానము. ఎదురు మున్నగునవి మినహాఅత్యావసర వస్తువులన్నింటినీ రవాణా చేస్తున్నాము అని రైల్వేల ఉపమంత్రి చెప్పారు.

# నియోగికమిటీ రిపోర్టు

## ప్రయాణీకుల రవాణా జాతీయకరణ

( గతసంచిక తరువాయి )

కేంద్రప్రభుత్వంవారు రోడ్డుట్రాన్సుపోర్టు కార్పొరేషన్లద్వారా రవాణా జాతీయకరణోద్యమాలను నడపాలని సూత్రప్రాయంగా నిర్ణయించి రాష్ట్రప్రభుత్వాల కన్నిటికి అట్టి ఏర్పాటును సూచించారు. ఈ కార్పొరేషన్ సంస్థలో రాష్ట్రప్రభుత్వాలతోపాటు, కేంద్రప్రభుత్వం వారున్నూ ప్రయివేటు పరిశ్రమదారులు, అవసరాన్నిబట్టి అవకాశం కలిగితే భాగస్వాములుగా వుండవచ్చును. జాతీయకరణ జరిగిన ప్రతి రవాణా సర్వీసుల నడకను ఈ కార్పొరేషన్ లే యాజమాన్యం వహించినడపాలి. ఆంధ్రప్రదేశ్, బీహారు, మహారాష్ట్ర, పంజాబ్, గుజరాత్, పశ్చిమబెంగాలు, మైసూరు రాష్ట్రాలవారు కార్పొరేషన్లను నిర్మించి పనిచేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్లో తెలంగాణా జిల్లాలన్నీ ఆంధ్రలోని 8జిల్లాల పైచిలుకుమాత్రం బస్సులజాతీయకరణ సాగింది. బీహారులో జాతీయకరణ రాష్ట్రమంతటా సాగింది. గుజరాత్లో నూటికి 90 వంతులు జాతీయకరణ సాగింది. 2178 రూట్లపై కార్పొరేషన్ బస్సులు నడిపితే ప్రయివేటు దారులకు 265 రూట్లు వదలి వుంచినారు. కేరళ ప్రభుత్వంవారు, ప్రయివేటు పరిశ్రమదారులు కూడా ఫీడరురూట్లపై పనిచేస్తూ కార్పొరేషన్ సర్వీసుల అభివృద్ధికి దోహదమిచ్చే విధానంలో, జాతీయకరణ వుద్యమంలో పాల్గొనవచ్చునన్నారు. మధ్యప్రదేశ్లో ప్రయివేటు ఆపరేటర్లతో కలిసి మెలిసి కార్పొరేషన్ బస్సులు నడుస్తున్నాయి. 1826 ప్రయివేటు బస్సులు నడిస్తే 394 కార్పొరేషన్ నడుపుతుంది. మద్రాసురాష్ట్రంలో 120 మైళ్ళకు మించిన రూట్లపై ప్రభుత్వం బస్సులు నడుపుతుంది. ఇవి ప్రయివేటు బస్సు సర్వీసులను తొలగించి ఏర్పరుపబడలేదు. మహారాష్ట్రంలో అమలులో వున్న బస్సుల జాతీయకరణ మూడవ పంచవర్ష ప్రణాళిక అసాంతానికి నూటికి నూరుపాళ్ళు పూర్తవుతుంది మైసూరు రాష్ట్రంలో బొంబాయి ప్రాంతం బస్సు సర్వీసులు పూర్తిగాను, హైదరాబాద్ ప్రాంతం సర్వీసులు 90 శాతమున్నూ, మైసూరు ప్రాంతంలో 40 శాతమున్నూ, మొత్తంమీద సగానికి సగం పైచిలుకు బస్సుల జాతీయకరణ సాగింది.

రాజస్థాన్లో బస్సులజాతీయకరణ సర్వతోముఖంగా వృద్ధికరంగా, లాభదాయకంగా సాగించాలని ఎంతత్వరలో వీలయితే అంతత్వరలో పూర్తిచేయాలనే వుద్దేశింపబడింది. పశ్చిమ బెంగాలులో 86 రూట్లపై ప్రభుత్వపు బస్సులు సాగితే 701 రూట్లపై ప్రయివేటు పరిశ్రమదారుల బస్సులను నడుపుచున్నారు. అంబాలా - జలంధర్ ప్రాంతంలో పంజాబ్ ప్రభుత్వం సగానికి సగంగా ప్రయివేటు ఆపరేటర్లతో కలిసి బస్సులను నడపటం సాగించింది. ఈ రాష్ట్రంలో ముఖ్యమంత్రి అభిప్రాయానుసారంగా ప్రయివేటు పబ్లిక్ రంగాల మధ్య అనవసరపు పోటీని సడలించేందుకు మానోపలీ

గల రూట్లపై ప్రభుత్వపు బస్సులలో ప్యాసింజర్లకు ప్రయాణపు రేటు అనవసరంగా పెంపుదల కాకుండా వుండేందుకు అసలు జాతీయకరణ సిద్ధాంతమే ప్రస్తుతానికి వాయిదా వేయటం అవుసరమని వ్యాఖ్యానింపబడింది. ఒరిస్సా రాష్ట్రంలో జాతీయకరణకు పూనుకోవాలంటే ప్రజలకు తక్కువ రేటుతో మంచిప్రయాణ సౌకర్యాలు కలిగించగలిగినప్పుడే ప్రభుత్వం తన యాజమాన్యాన్ని పొందాలని వివరింపబడింది.

సరకులు మోసే లారీల విషయంలో జాతీయకరణ విధానాన్ని ఏ రెండుమూడు రాష్ట్రప్రభుత్వాలు తలపూపటమో జరిగింది. కాని మొత్తం మీద సరకుల రవాణా సర్వీసుల జాతీయకరణ అనుచితమని నిర్ణయింపబడింది. బీహారు, రాజస్థాన్ ప్రాంతాలలో కేంద్రప్రభుత్వం మూడవ ప్రణాళికలో సరకుల రవాణా జాతీయకరణ విధానం దృష్ట్యా ప్రణాళికాసాంతంలో విచారింపదలచారు. ఒరిస్సా, రాజస్థానులో ఆర్థిక యిబ్బందుల వల్ల సరకుల రవాణా జాతీయకరణ అసంబద్ధమన్నారు. మధ్య ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్‌లలో రాష్ట్రప్రభుత్వాలకు సంపూర్ణాధికారం యిస్తే సరకుల రవాణా జాతీయకరణవిషయం ఆలోచిస్తామన్నారు. ఉత్తర ప్రదేశ్‌లో రైల్వే రవాణాకు అనుబంధంగా రోడ్డురవాణా ఏర్పరచి నడుపదలచినా ప్రయివేటు రంగంలో వలె రైల్వే సంస్థ సర్వీసు సామర్థ్యాన్ని బాగుచేస్తే గాని వీలుపడదన్నారు.

వయబుల్ యూనిట్లు:- 1961 జూలై నెలలో సమావేశమైన రోడ్ అండ్ యిన్‌లాండ్ వాటర్ ట్రాన్సుపోర్టు అడ్వయిజరీ కమిటీవారి భావనమేరకు వయబుల్ యూనిట్లు పెంపుదలను గుర్తింపదలచినారు. రాష్ట్రప్రభుత్వాలకు వీరు సూచిస్తూ రోడ్డు ట్రాన్సుపోర్టు రీఆర్గనైజేషన్ కమిటీవారి సూచనలను పాటించమని సలహా యిచ్చారు. 1961 అక్టోబరులో చెప్పబడిన యీ సూత్రం 1962 జనవరిలో ట్రాన్సుపోర్టు కమీషనర్ల సమావేశంలో తిర్గి చర్చింపబడింది. వీరి నిర్ణయానుసారంగా రాష్ట్రాంతరరవాణా రహదారులపై సుదూరప్రయాణాలకు అనుమతి నివ్వటానికి వయబుల్ యూనిట్ల ప్రాధాన్యం గుర్తించాలని, పన్నుల వసూలు విధానంలో ప్రత్యేక చెల్లింపు అనుమతి విధానం వాయిదాల పద్ధతి వయబుల్ యూనిట్లకు ఏర్పరచాలని, ఆర్థిక మద్దతు ప్రభుత్వపు సంబంధముగల బ్యాంకుల ద్వారా ఏర్పరచాలని, దొరకని సామానుల దిగుమతివిధానంలో లైసెన్సులిచ్చి సులువు పద్ధతులు, వయబుల్ యూనిట్లు ఏర్పరచి రవాణా సౌలభ్యం కలిగించే వారికి ఏర్పరచాలని, మొదటి రెండు సలహాలు రాష్ట్రప్రభుత్వం వెంటనే అమలు నకుపూనుకోవాలని చెప్పబడింది. స్టేటు ఫైనాన్షియల్ కార్పొరేషన్ ఆక్టును సవరిస్తూ యితర పరిశ్రమలకువలె రోడ్డురవాణా పరిశ్రమకు కలిగించటానికి చట్టబద్ధమైన ఏర్పాటు జరిగింది.

ఈ ఏర్పాటు ననుసరించి సహకార పరపతి సంఘాలుగా ఏర్పడిన వాటికి 20 లక్షలదాకాన్నూ, యితర సంస్థలకు, యూనిట్లకు పదిలక్షల దాకా సహాయం లభించే ఏర్పాటు. దీనిననుసరించే సామాన్ల దిగుమతి నిబంధనలలో వాడకందార్ల సంస్థలకు 25 బండ్లకు మించి నడిపే వారికి దిగుమతి లైసెన్సులు మంజూరు ఏర్పాట్లు చేశారు. ఇన్ని చేసినా ఆశించినంతగా వయబుల్ యూనిట్ల నిర్మాణం వృద్ధిపొందలేదు.

ఆంధ్ర ప్రదేశ్‌లో:- వయబుల్ యూనిట్ల నిర్మాణానికి దోహదంగా పర్మిట్ల విధానంలో

వీలుకల్పించబడింది. బస్సురూట్ల విషయంలో ముఖ్యంగా యీ గుర్తింపు సాగింది. ఏమ సంఖ్య వరకు సాధించటానికి ప్రయత్నాలు సాగి నడిచాయి. పరిశ్రమదారులలో సఖ్యతగా నలుగు రైదుగురన్నా కలిసి వయబుల్ యూనిట్ల నిర్మాణం సాగిస్తారంటే అది వారి కనుకూలవిధాన నిర్వహణంగా మాత్రమే సాగాలిగాని ప్రభుత్వం చేయగలిగింది లేదు సుస్థిరమైన సర్వీసు సంస్థలుగా వున్న వారికి మాత్రం ట్రాన్సుపోర్టు కమీషనర్ల సమావేశపు చర్చలలోని కొన్ని పద్ధతులను వయబుల్ యూనిట్ల ముసుగడ కనువుగా కల్పింప జూస్తున్నారు.

బీహారురాష్ట్రంలో.- కోపరేటివ్ సంస్థల నిర్మాణ సాధనా కార్యక్రమంలో సుస్థిరత సాధించేందుకు పర్మిట్లజారీ విధానం రూపొందించారుగనుక పదిబండ్లకు తక్కువగాకుండా వుండే ఏర్పాటు సాగుతుండటంవలన యీ వైబుల్ యూనిట్ల నిర్మాణం విషయంలో ప్రత్యేక శ్రద్ధ లేదు.

గుజరాత్‌లో:- బస్సుల జాతీయకరణ సాగిస్తూన్నందువలన వైబుల్ యూనిట్ల నిర్మాణానికి ప్రత్యేకత లేకపోయినా నాలుగుబండ్లతో 7 గురు పెర్లతో సహకారపరపతి సంస్థల నిర్మాణానికి అవకాశాలు గుర్తింపబడినాయి. సరకుల రవాణాదారులలో యీ విధానంగాని మరియే కలసికట్టు విధానంగాని కుదరనందున వారి అనుసరణే లేదు. అయినప్పటికి ఈ రాష్ట్రంలో 20 లారీలకు మించిన ఏడుగురు యజమానులు వున్నారు. 8354 పర్మిటుదార్లు ఏమబండ్లలో పుగా కలిగి సర్వీసునడుపుచున్నారు.

కేరళలో:_ 20 బండ్లు కలిగిన సొష్టవమైన సంస్థల నిర్మాణం ఆశింపబడింది. పదిమందికలిసి వస్తేను, సహకార సంస్థలుగా రూపొందితేను పర్మిట్లవిధానంలో సులువు ఏర్పరచటంద్వారా వయబుల్ యూనిట్ల నిర్మాణాన్ని కలిగింపదలచారు. దీనివలన ఈనాడు పరిశ్రమలోవున్న అవినీతి, తప్పుడు నడక తగ్గి ఉచితరీతిని సర్వీసులు సాగే సావకాశం కలదని గుర్తింపబడింది.

మధ్యప్రదేశ్:- మధ్యప్రదేశ్ ప్రభుత్వం వారు 1958 డిశంబరు నెలలో వయబుల్ యూనిట్ల నిర్మాణాత్మకాభివృద్ధికై తగుసలహాల నిచ్చేందుకు ఒకకమిటీని ఏర్పరచారు. ఆ కమిటీవారు 'ఛత్తీస్‌ఘర్' ప్రాంతంలో విచారణలు జరిపి 1960 ఫిబ్రవరి నాటికి తమ నివేదిక నందజేశారు. అందులో ముఖ్యంగా సహకార పరపతి సంస్థల ప్రాధాన్యంగా వయబుల్ యూనిట్ల నిర్మాణాన్ని రూపొందించటానికి చిన్న చిన్న సంస్థలను ఏకంచేసి పెద్ద సంస్థగా వ్యవహరింపజేస్తూ కష్టపడి నిజాయితీపై పనిచేయటానికి అలవాట్లకు పరిరక్షింపబడాలంటూ తెలియజేశారు. 21 నుండి 102 బండ్లదాకా గల వయబుల్ యూనిట్లు యీరాష్ట్రంలో వున్నా, వానికి భవితవ్యం సరిగ్గాకనిపించలేదు. జాతీయకరణ విధానం సాగించదలచిన చోట్ల వున్న మానోపలీ అవకాశంలో వ్యాపారాన్ని సాగించటంతోబాటు విస్మరింపబడిన ప్రజాసౌకర్యం గుర్తింపబడాలి. ముసానీకమిటీ రిపోర్టు ప్రకారం 49 ఏ. సెక్షను మార్చేందుకు మోటారు వెహికిల్సు ఆక్టులో వీలులేకున్నా, రాష్ట్రప్రభుత్వంవారు నమ్మకమైన సంస్థల అభివృద్ధికి దోహదం కల్పించటానికి వెనుకదీయటంలేదు.

మద్రాసు ఏమ బండ్లతో వైబుల్ యూనిట్ల నిర్మాణం బస్సుల రవాణాసౌకర్యం విషయంలో సాగుతూనేవుంది. 16 నం 75 మైళ్ళ వరకుగల

రస్తాలపై అట్టి యూనిట్ల నిర్మాణానికి వీలుగా రీజినల్ ట్రాన్సుపోర్టు అథారిటీవారు తగిన ప్రోత్సాహమిస్తున్నారు. 1961 నాటికి ఈ రాష్ట్రంలో ఒక్క బండి కలిగినవారు 243 న్నూ, నాల్గుబండ్లు కలిగినవారు 60 మందిన్నీ 134 మంది ఐదునుండి తొమ్మిదిబండ్ల వరకున్నూ, 76 మంది తొమ్మిదిబండ్లకు మించిన వయబుల్ యూనిట్లు కలిగియున్నారు. లారీల విషయంలో 5, 325 సీరియల్ లారీల ఆపరేటర్లున్నూ ఐదు లారీలు అంతకు మించినలారీలు కలిగిన ఓనర్లు 51 మందిన్నీ వున్నారు. రూల్సుకు వ్యతిరేకంగా నడుపబడిన సందర్భాలలో కేసులు సింగిల్ ఓనర్లకు, ఫ్లీట్ ఓనర్లకు తేడా లేకుండా వున్నట్లు గమనింపబడినది.

మహారాష్ట్ర:- బొంబాయి మోటారుబండ్ల చట్టపు రూల్సులో 79 వ రూలును మారుస్తూ కొత్తపర్మిట్ల గ్రాంట్లవిషయంలో వయబుల్ గ్రాంట్లనిర్మాణం ప్రోత్సాహపరిచేందుకు ప్రత్యేక శ్రద్ధచూపించే అవకాశాన్ని కలిగించారు. వయబుల్ యూనిట్లునకు పదిబండ్లకు తక్కువకా



జంటగా గగనంలో విహరించి అనుభవించని స్వర్గాన్ని భూతలంమీద చవిచూడనెంచి, జతగూడిన వ్యోమగాములు శ్రీమతి తెరిష్కోవా; నికొలయేవ్‌లు భారతభూమిపై స్వర్గ సౌఖ్యాన్ని, కొత్తవలపుల పంటను చవిచూడటానికి విచ్చేసిన సందర్భంగా భారతీయుల ఆశీర్వాదాలు అందుకున్న కొత్త జంట.

రాదని వీరి అభిమతం. అట్టి యూనిట్లకు వీలున్నంతవరకు ఫైనాన్సింగ్ ఏర్పాట్లు స్టేటు ఫైనాన్సింగు కార్పొరేషనువారివల్ల యేర్పరచదలచారు. బస్సుసర్వీసులజాతీయకరణపథకందృష్ట్యా ప్రభుత్వ రంగంలో వైబుల్ యూనిట్ల నిర్మాణానికి కృషిచేయుటంలేదు. లారీ సర్వీసుల అభివృద్ధికి అవకాశం అధికంగా వుండుటవలన ఫ్లీట్ ఓనర్లకు యింపోర్టు లైసెన్సులు యివ్వటం ద్వారా దూరపు ప్రయాణాలు చేసే వారికి వీలైనన్ని తగ్గింపులు, రిబేటులు, పర్మిట్ల విధానంలో సులువు మార్గం వగైరాలు, లైన్లు, సామానులు సప్లయి విషయంలో వుసులుబాటు కలిగించటానికి ఏర్పాట్లు వున్నవి. బస్సు సర్వీసులలో అంబాలా, జలంధర్ ప్రాంతాలలో పని చేయు వారు కంపెనీలుగాను కోపరేటివ్ సంస్థలుగాను ఏర్పడటం వలన సింగిల్ ఆపరేటర్ల ప్రమేయం లేదు. ఏడు బండ్లు అంతకు మించి యీ యూనిట్ల నిర్మాణం సాగింది. ప్రభుత్వపు లెక్కల ప్రకారం లారీ సర్వీసులలో సింగిల్ ఆపరేటర్ల సంఖ్య అధికంగానే వుంది. కొద్దిగా కోపరేటివు సంస్థలు, కంపెనీలు పని చేస్తున్నప్పటికి వయబుల్ యూనిట్ల నిర్మాణం ప్లానింగ్ కమిషన్ వారి లారీల జాతీయకరణ విధానం వలన సాధ్యపడటం లేదు. ప్రభుత్వం యూనియన్ల ఏర్పాటు ద్వారా కొంతవరకు యీ యూనిట్ల నిర్మాణానికి పునాదులు వేసి కృషి సాధించారు.

రాజస్థాన్ : ఈ రాష్ట్రంలో సింగిల్ ఆపరేటర్ల సంఖ్య ఎక్కువగానే వుంది. వయబుల్ యూనిట్ల నిర్మాణాన్ని ప్రోద్బలించేందుకు ప్రభుత్వం దూరపు ప్రయాణ పర్మిట్ల విధానంలోను, రాష్ట్రాంతర పర్మిట్ల విధానంలోను చట్టబద్ధంగా కొన్ని మార్పులు తెచ్చేందుకు పది బండ్లకు దాటి నడిపేవారికి పన్ను చెల్లింపు మొత్తంలో నూటికి పదివంతులు రిబేటు ఏర్పాటు చేసేందుకు చర్యలు తీసుకోబోతున్నారు.

ఉత్తర ప్రదేశ్ : సెక్షన్ 493, 49 ఎ అనే అనుబంధ సిద్ధాంతం ఏర్పరచి వయబుల్ యూనిట్ల నిర్మాణావకాశాన్ని బలపరుస్తూ 47, 55 సెక్షన్లలో కూడ కొన్ని మార్పులు తెచ్చి పర్మిట్లు గ్రాంటు విధానంలో వయబుల్ యూనిట్ల వారికి కలిగించే సదవకాశాల వల్ల పరిశ్రమదారులలో ప్రయివేటురంగంలో ఈనాడున్న దురలవాట్లను కూడ తగ్గించే సావకాశం వున్నదని దాని అమలుకు ఏర్పాట్లు చేయదలచారు.

పశ్చిమ బెంగాల్ : ఈ రాష్ట్ర ప్రభుత్వం వారు వయబుల్ యూనిట్ల విధానానికి యింకా ఎట్టి జాగ్రత్తలు తీసుకొనే అవకాశాన్ని పెంచ లేదు. జాయింటు స్టాక్ కంపెనీలకు కోపరేటివు సంస్థలకు పర్మిట్లు జారీని అభిలషించుట చేత ప్రభుత్వం పెద్ద సంస్థల నిర్మాణానికి నాందివేసి రాను రాను జాతీయకరణ సాగించేందుకు అవకాశ మధిక మనుకొంటున్నారు. ఏమైనా యీనాడు యీ రాష్ట్రంలో సింగిల్ ఆపరేటర్ల సంఖ్య హెచ్చుగానే వున్నది.

కిరాయిల మతలబు : అత్యధిక కిరాయిల హద్దును నిర్ణయిస్తూ బీహారు, మహాకోసల్,

భోపాల్ ప్రాంతాలలో మధ్యప్రదేశ్ ప్రభుత్వం పంజాబ్, రాజస్థాన్ కేరళ రాష్ట్ర ప్రభుత్వాల చర్యలు తీసుకొన్నవి. ఒరిస్సా ప్రభుత్వం వారు వారి ప్రాంతాలలో కిరాయిల హద్దును ఏర్పరచినారు. ప్రయాణీకుల రవాణా విషయంలో మాత్రమే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు అత్యధిక పరిమితిని నిర్ణయించారు.

రాజస్థాన్, ఉత్తరప్రదేశ్‌ల పర్వత ప్రాంతాలలో అత్యధిక పరిమితి, అత్యల్ప పరిమితిని నిర్ణయించారు. మహారాష్ట్ర, గుజరాతు, బీహార్ కేరళ రాష్ట్రాలలో అత్యధిక పరిమితిని పంజాబ్ మైసూరు రాష్ట్రాలలో అత్యధిక అత్యల్ప పరిమితుల నిర్ణయం జరిగింది. ఒరిస్సాలో స్టేటు ట్రాన్సుపోర్టు కార్పొరేషన్ సర్వీసులలో పరిమితులు నిర్ణయింప బడినవి. ప్రయివేటు సెక్టారులో ఏ రీజను కారీజనల్ అథారిటీ పరిమితుల నిర్ణయం చేసింది. మధ్యప్రదేశ్‌లో అత్యధిక పరిమితిని మధ్య భారత్ మహా కోసల ప్రాంతాలలో నడుపబడే ప్రభుత్వపు బస్సులకు ఏర్పాటు చేశారు. ప్రయివేటు సర్వీసుల విషయంలో అత్యధిక పరిమితిని మధ్య భారత్ భోపాల్ ప్రాంతాలలోను అత్యల్ప పరిమితిని మహా కోసక ప్రాంతంలోను ఏర్పరచారు. రేవా, సిరోంజ్ ప్రాంతాలలో ఎట్టి పరిమితి విధింపులేదు. పశ్చిమ బెంగాలు ప్రభుత్వం ప్రయాణీకుల రవాణాకు, సరుకుల రవాణాకు ఎట్టి పరిమితులు ఏర్పరచలేదు. సామాన్యంగా అంతటా రీజినల్ ట్రాన్సుఫోర్టు అథారిటీవారు రూటు పొడవును, ట్రాఫిక్ ఒత్తిడిని గమనించి కిరాయి వసూలు విధానాన్ని రూపొందించారు. రాష్ట్రాంతర రవాణా ఏర్పాట్లలో ఒండొరుల పరస్పర సంప్రదింపులపై కిరాయి వసూలు విధాన సిద్ధాంతం ఏర్పరచుకొనే సావకాశం వుంది.

పన్నుల విధానం :— దేశ మంతటా అన్ని రాష్ట్రాలలోను మోటారు బండ్లపై పన్ను వసూలు విధానం ఏర్పడి వున్నది. మద్రాసు రాష్ట్ర, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలలో తప్ప మిగతా అన్ని రాష్ట్రాలలో బస్సుల సీటింగ్ కెపాసిటీ ప్రకారం పన్ను విధింపు జరుగుతుంది. మద్రాసు రాష్ట్రంలో రోజులో ఒక్కొక్క బస్సు తిరిగే మొత్తం మైలేజి 1 నుండి 210 కిలోమైళ్ళ వరకొక రేటు 210 నుండి 270 కిలోమైళ్ళ వరకొక రేటు 270 కిలోమైళ్ళపైనగల వాని కొక రేటు నిర్ణయించటం జరిగింది. ఈ రోజువారి మైలేజి కూడ మునిసిపల్ ఏరియాలో ఐతే ఒక విధంగాను జిల్లా రోడ్లపై అయితే మరొక విధంగాను గుర్తింపబడినాయి. ఉత్తర ప్రదేశ్‌లో ఎ. బి సి. అనే విభాగాలుగా రోడ్లను గుర్తించి వానిపై తిరిగే బస్సుల పన్ను విధింపు జరుగుతుంది. పంజాబు, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములలో తప్ప మిగతా అన్ని రాష్ట్రములలో పబ్లిక్ సరుకులను మోసే బండ్లపై పన్ను విధింపు కాని రిజిష్టర్డు లేడన్ బరువుపై ఆధారపడి వున్నది. పంజాబు రాష్ట్రంలో పబ్లిక్ సరుకులను మోసే బండ్ల విషయంలో అనే లేడన్ బరువుపై ఆధారపడి నిర్ణయం జరుగుతూ నాల్గు టన్నులపై బడే

బరువు కలిగిన బండ్లన్నిటికీ ఒకే ఒక నిర్ణీతమైన రేటు వున్నది. రాజస్థాన్‌లో పబ్లిక్ లారీలు తిరిగే ప్రాంతపు పరస్థితులను మోసే బరువును బట్టి కూడా విధింపు సూత్రము నిర్ణయింపబడుతుంది. ఉత్తరప్రదేశ్‌లో బస్సులవలె లారీలు కూడా అవి నడుపబడే రోడ్ల గుర్తింపును బట్టి జరుగుతుంది. గుజరాత్, మహారాష్ట్ర రాష్ట్రాలలో మోటారు బండ్లు పెట్రోలుపై నడచే వానికి ఒక రేటు డీజిల్ ఆయిల్‌పై నడచే వానికి మరొక రేటు, వున్నది. కేరళ రాష్ట్రంలో మలబార్, కొచ్చిన్ ట్రావెన్‌కూర్ ప్రాంతాలకు వేరు విధమైన ప్రత్యేక పన్ను వసూలు విధానం గలదు.

ప్రయాణీకులు-సరకులుపై పన్ను :— ఈ పన్ను విధానం బీహారు, పంజాబు రాజస్థాన్ ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర గుజరాత్ మైసూరు మద్రాసు మధ్యప్రదేశ్. కేరళలో మలబార్ ప్రాంతంలో ప్రయాణీకులపైన సరకులపైన విధింపు జరిగింది. ఒరిస్సాలో సరకుల రవాణాపైన మాత్రమే యీ అదనపు పన్ను జరిగింది. ఉత్తరప్రదేశ్‌లో ప్రయాణీకులపైన మాత్రమే అదనపుపన్ను విధింప బడింది. రాజస్థాన్‌లో ప్రయాణీకుల పన్ను పక్క రోడ్లపై తిరిగే బస్సుల కొక విధంగాను కచ్చా రోడ్లపై నడచే వానికి మరొక విధంగాను విధింపబడింది. సరకుల రవాణా విషయంలో మోసే బరువు తిరిగే రూటును బట్టి తేడాలు గుర్తింపబడినవి.

ఇతర పన్నులు :— పంజాబ్, ఉత్తర ప్రదేశ్, ఒరిస్సాలో సాంబళపూర్ మునిసిపల్ ఏరియాలో ఆక్ట్రాయి పన్ను విధింప బడింది. అదే విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో హైదరాబాద్ సికిందరాబాద్ ప్రాంతంలోను గుజరాత్, మహారాష్ట్ర, మైసూరు రాష్ట్రాలలో ఆక్ట్రాయి పన్నుల విధింపు లేదు. టోక్ పన్నులంటూ వసూలు బ్రిడ్జీల వద్ద ఆంధ్రప్రదేశ్ కేరళ యునైటెడ్ రాష్ట్రంలు, పశ్చిమబెంగాలు పంజాబు రాష్ట్రాలలో వున్నవి. రాజస్థాన్‌లో చట్టబద్ధంగా ఏ ప్రయివేటు అధికార సంస్థకూడ మోటారు బండ్లపై అదనపు పన్ను విధింపరాదంటూ నిషేధం వుంది. ఒరిస్సాలో కొన్ని రోడ్లపైన బ్రిడ్జీలపైన టోక్‌పన్ను విధింపు చట్టబద్ధంగా గుర్తించి వసూలు చేస్తున్నారు.

## ఆర్. టి. సి. సిబ్బంది గృహవసతి నిర్మాణానికి. శ్రీ కతారి ప్రారంభోత్సవం.

ఆంధ్రప్రదేశ్ రోడ్‌రవాణా కార్పొరేషన్ ఉన్నతోద్యోగులకు. వర్కర్లకు విజయవాడలో నిర్మించబడిన వసతిగృహాలకు కార్పొరేషన్ ఛైర్‌మన్ శ్రీ ఆర్.డి. కతారి నవంబర్ 30 వ తేదీన ప్రారంభోత్సవంజరిపారు. ఈసందర్భంలో ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ వి. వి. రామారావు అధ్యక్షతవహించారు. శ్రీ కతారి ప్రసంగిస్తూ త్వరలోనే విజయవాడనుంచి మద్రాస్‌కు సరాసరి బస్సు సర్వీసును ప్రవేశపెట్టనున్నట్లు తెలియజేశారు. డివిజనల్ కంట్రోలర్ శ్రీ సుబ్బారాయుడు అతిథులకు స్వాగతం చెప్పారు. అనంతరం అసిస్టెంట్ ఇంజినీర్ శ్రీ కృష్ణారావు వందన సమర్పణ చేశారు.

# కడపజిల్లాలో మోటార్ ట్రాన్సుపోర్టు ఆపరేటర్స్ అసోసియేషన్ సమావేశం

కడప జిల్లాలో మోటార్ ట్రాన్సుపోర్టు ఆపరేటర్స్ అసోసియేషన్ సమావేశం నవంబరు 17వ తేదీన శ్రీ డి. నారాయణరెడ్డి (ఎం.ఎల్.సి) అధ్యక్షతను జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో జరిగింది ఆ సమావేశంలో కొన్ని తీర్మానాలను చేశారు. ఆంధ్రప్రదేశ మోటారువెహికల్సు ఆక్టు 1963 అమలు పరచుటవలన కలుగుతున్న కష్ట-నష్టములను ప్రభుత్వం పరిశీలించాలని, ఆగివున్న వాహనాలకు టాక్సుబకాయిలు వసూళ్ళను నిర్బంధించకూడదని, 'సి' బుక్ సహా స్టాకీజి రిపోర్టును దాఖలుచేయుటకు 31-12-63 వరకు ఆపరేటరులకు అనుమతి యివ్వవలెనని, 1-4-63 నుండి ఆపివుంచిన వాహనాల యజమానులు వాటికి సంబంధించిన నివేదికలు దాఖలా చేయవలసినదిగా కోరులాగున లయిసెన్సింగ్ అధికారులకు ప్రభుత్వం ఆదేశాలు ఇవ్వవలసిందిగాను, క్వార్టరు ప్రారంభదశలో తిరుగని వాహనాల రిజిస్ట్రేషను సర్టిఫికెట్లు లైసెన్సింగ్ అధికారులవద్ద దాఖలు చేయుటకు అదనపు గడువు నొసంగవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుటకుగాను, ఈ పై అంశాలను ముఖ్యమంత్రికి రవాణాశాఖామంత్రికి నివేదించడానికి శ్రీయుతులు డి. నారాయణరెడ్డి, వి ఆర్ సత్యనారాయణ, జి. రంగారెడ్డి, పి. వెంకటసుబ్బయ్య శెట్టి, పి. నరసింహయ్య, జి. ఎ. జలీల్ గార్లతో ఒక కమిటీని అసోసియేషను వారు ఎన్నుకున్నారు.

—(***)—

లెఫ్టినెంట్ జనరల్స్ విక్రమసింగ్, దౌలత్ సింగ్, ఎయిర్ వైస్ మార్షల్ పింటో, మేయర్ జనరల్ నానావతి, బ్రిగేడియర్ ఒబిరాయ్ ఈఐదుగురు ప్రముఖ భారత వైమానిక, సైనిక బలాధిపతులు కాశ్మీర్‌లో మొన్న జరిగిన హెలీకాప్టర్ విమాన ప్రమాదంలో మరణించారు. యిలాంటి దుస్సంఘటన జరగటం భారత సైనిక చరిత్రలో యిదే ప్రథమం. వీరు పశ్చిమప్రాంతపు సేనానులు, మహావీరులు. వీరు మరణించటం సైన్యానికీ, దేశానికీ తీరనిలోటు.

స్వదేశరక్షణ, కర్తవ్యనిర్వహణలలో అసువులనొడ్డి వీరస్వర్గమలంకరించిన యీ సేనానుల ఆత్మలకు శాంతి కలుగుగాక!

"ఎడిటర్"

# అభివృద్ధిపథంలో

## అవలంభించిన ట్రాఫిక్ సర్వే.........

స్వతంత్ర భారతదేశంలో ఏదిరిశక్తులతో సాగుతున్న ఘర్షణకు ఎదురీతతో యిరుగు పొరుగు విపరీతశక్తితో వెనుదీయకుండా వారి సవాల్ నెదుర్కొంటూ ప్రణాళికాభివృద్ధిని సాధింపవలసినఅవుసరమెంతేని వుంది. ప్రజల సౌకర్యము, జీవన ప్రమాణము పెంపుదల వహించి అందరూ తగినంతగా వ్యక్తిత్వంతో సమానపాయిలోనిలబడగలగటానికి చేయబడే ప్రణాళికాసాధనసమగ్రంగా సాగిపోవటానికి రవాణాసౌలభ్యత పెంపుదలతప్పనిసరి అని తేలిపోయింది. రైల్వేలలో వీలున్నంతలో సాగింపగల్గినంత అభివృద్ధి కార్యకలాపాలు సాగుతున్నవి. అయితే ఆ ప్రయత్నంవలన కలిగేఫలితాలవల్ల సమకూడే రవాణా సౌలభ్యం ప్రణాళికాధ్యేయాన్ని పొందేందుకు వీలుకల్పింపనందున మరొక రకమైన మార్గం వెతకవలసి రావటంతో దేశవ్యాప్తంగా 'ట్రాఫిక్ సర్వే' ఏర్పాటుచేయవలసియున్నది. పూర్వంనుండి అమలులో వున్న గ్రామీణ రహదారుల పెంపుదలతోపాటు జాతీయరహదారులు దాకా పెంపుదల కావలసినట్లు గుర్తింపబడింది. మంచిరోడ్లు దేశవ్యాప్తంగా కల్పింపగలిగితే శీఘ్ర ప్రయాణాలకు తక్కువ శ్రమతోను పొదుపుగా కాలవ్యవధిని తగ్గించి రవాణా సౌకర్యాన్ని పెంచవచ్చునని గుర్తించి అమలుజరుపుతున్న కార్యక్రమాలకు అదనంగా జాగ్రత్తలు తీసుకోగలిగితే శత్రువులకభేద్యమైన శక్తి సమీకరణకు సాధ్యమవుతుందని గుర్తించి రకరకాల అన్వేషణా పద్ధతుల ప్రభుత్వం అమలుపరుస్తూనే వున్నది. అట్టి రోడ్ల అభివృద్ధి పథకాల సాధనకు ప్రపంచబ్యాంకు వారి సహాయం పొందగోరి చేసే కృషికి కావలసిన వివరాల సేకరణ కార్యక్రమంలో ది 8-10-63 నుండి వారం రోజులు శ్రీ జి. రామచంద్రన్ ఆధ్వర్యంలో విజయవాడ ప్రాంతంలో జాతీయరహదారులపై సర్వే జరుపబడి వివరసేకరణ సాగింది.



అదేవిధంగా ది 3-11-63 న శ్రీ కె. శంకర్ గారి ఆధ్వర్యంలో మరొక సర్వేపార్టీ విషయసేకరణ చేసింది. వీరు కేవలం వచ్చే పోయే లారీలనాపి సరుకువివరము ఎచటినుండి ఎచటికి సరుకు పోవుచున్నదో అన్న వివరాలేగాక లారీలపై పనివారిని పలుకరించి, ఓనర్లను కలుసుకొని వారివారి అనుభవానికి తోచిన వివరాలవల్ల జాతీయ రహదారులపై నిర్మాణంలోను నడుపబడిన శకటముల వివరాలలోను ఏఏప్రాంతాలను కలుపుతూ రోడ్ల నిర్మాణం సాగవలసివుంటుందనే గుర్తింపును గూడ చేయగలిగారు.



రోడ్డు మార్జినులు సక్రమంగా లేకుండుటవలన వేయబడిన జాతీయ రహదారులపై పూర్తిగా సిమ్మెంటు రోడ్లు లేకపోవటం వేసినవానికి ఉపరితలం ఒకే సమానమైన పాలిష్ కలిగి వుండక గుంటలు మిట్టలు వుండటంవలన త్వరలో పాడవటం జరుగుతున్నట్టు చర్చింపబడ్డది. అంతేగాక రోడ్డువాడకందారులవల్ల గ్రహింపగల్గిన ముఖ్యవిషయం ప్రయోగాత్మకంగా చూడవలసియున్నట్టు గుర్తింపబడి మార్జినులు సిమ్మెంటు కాంక్రీటు వేయుచు మధ్యరోడ్డు తారు కంకరకలిపి ఉవ్వెత్తుగా ప్రక్కలకునీరు కాంక్రీటు మార్జినుల చేరువిధంగా వేస్తే మంచిదని గ్రహింపబడింది. మార్జినులు సరిలేనందువలన శకటాల నడకకే అవరోధం సాగటం, ప్రమాదాలు సంఖ్య పెరగటంతో పాటు రోడ్డు పాడనటం తెలియజేయబడింది. అదేవిధంగా సాఫీరోడ్డు రెండు బండ్లు ఒకసారిగా పోగలిగి యుండకపోవుటవల్ల రోడ్డు ప్రక్కగ్రామాలవారు రోడ్డు మార్జినులను ఆక్రమించి నివాసాలు వ్యాపార గృహాలు నిర్మించటం వలన ప్రమాదాల పెరుగుదలవున్నట్టు చెప్పబడ్డది. బలహీనమైన బ్రిడ్జీలు వుండటం నదులపైన, పెద్దవాగులపైన సక్రమమైన బ్రిడ్జీలు లేకపోవటం రహదార్ల నిర్మాణంలో లికింగ్ రోడ్లు వదలివేయబడటం సాఫీరవాణాను అవరోధిస్తున్నట్టు గుర్తింపబడ్డది.



ఇదేవిధంగా అన్ని జాతీయరహదారుల పైన, కేంద్రరవాణా మంత్రిత్వశాఖా ప్రతినిధులు ట్రాఫిక్ సర్వేజరిపి వివరాలు సేకరించారు. అంతేగాక కేంద్రరవాణా శాఖవారు నౌకా రవాణాను తీరప్రాంతాలలో సరుకుల చేరవేతకు ముడిసరుకుల సరఫరాకు వినియోగించేందుకు వీలుకల్పించే పథకాలతోపాటు దేశీయ జల రవాణా కార్యక్రమాలు అభివృద్ధి చేయదలచారు. చిన్నరేవుల అభివృద్ధితోపాటు నదులపైన కాలువలపైన సాగే అన్నిరకాల వ్యాపార ప్రయాణ సౌకర్యసాధనాల లెక్కల సేకరణసాగించి ఉచితమైన ప్రాంతంలో అభివృద్ధి పథకాలు సాగించి అనవసర రవాణా పోటీని తొలగిస్తూ సమన్వయ రవాణా సాధనకు దోహదం కల్పించేందుకు కృషిచేస్తున్నారు. కేంద్ర రవాణామంత్రిత్వశాఖలో డా॥ గంగూలీ అభివృద్ధిపథకాలపై పరిశోధనజరిపి ప్రణాళికారచన చేస్తున్నారు. అదేవిధంగాగూడా అధిక శ్రద్ధతో దేశీయ జలరవాణా పెంపుదలవల్ల రవాణాలో ఖర్చు తగ్గించి పొదుపు సాధింపవచ్చుననే విశ్వాసంతో అభివృద్ధి పథకాల అన్వేషణ సాగిస్తున్నారు. అరమరికలేని అధికారవర్గ సహకారంతో సేకరించే వాస్తవమైన విషయసేకరణ నిర్దిష్ట ప్రణాళికారచనకు అవసరానవసరాలగుర్తింపుతో కావలసిన అభివృద్ధికి దోహదం కల్పించటమే గాకుండా ప్రజలకు పరిశ్రమదారులకు ఒద్దికగా అభివృద్ధిని పంచుకొని సాగించి సాధించేందుకు వీలుకల్పిస్తుంది..






చిత్తరంజన్ కర్మాగారం నుండి మొదటి ఏ.సి. ఎలక్ట్రిక్ రైలుయింజనుకు "బిధాన్" అని పేరుపెట్టి ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు గతసంవత్సరంలో భారత రైల్వేలపై 1780 లక్షల టన్నులు రవాణా చేయబడ్డవని ఈ రవాణాపథకాన్ని అభివృద్ధి చేసి ప్రణాళికా ధ్యేయాన్ని అందుకొనేందుకు ఎలక్ట్రిక్ రైళ్ళు డీజిల్ రైళ్ళు ప్రవేశపెట్టబడ్డాయని రైల్వేమంత్రి శ్రీ దాసప్ప వివరించారు.

* * *

మోపెడ్ స్కూటర్ లాంటి శకటాలతయారీకి లైసెన్సులు జారీచేసిన మూడుకర్మాగారాలలో ఒకటి ఆంధ్రప్రదేశ్ లో యేర్పాటు అవుతుందనీ, ఒక్కొక్క కర్మాగారంలో ప్రథమ దశలో తొమ్మిదివేల స్కూటరులు తయారు అవుతాయని కాని ధర ఒక్కొక్కటి వెయ్యి నుండి 1200 రూపాయల మధ్య వుంటుందని కేంద్ర ఉపమంత్రి శ్రీ ప్రకాశచంద్రసేథి తెలియచేశారు.

* * *

ప్రతిరోజూ తొమ్మిదివేల మైళ్ళు, ఏబదిలక్షల మంది ప్రయాణీకులతో పాటు ఏలక్షల టన్నుల సరకును చేరవేస్తూ 12 లక్షల పైచిలుకు సిబ్బందితో 1900 కోట్ల రూపాయలు పెట్టుబడితో పనిచేస్తూ ఆర్థికంగా లాభసాటి అయిన రైల్వేలలో ప్రపంచంలో కల్లా ఒకటిగా భారత రైల్వేలు నిలబడగలిగిందని కేంద్రరైల్వేమంత్రి శ్రీ దాసప్ప తెలియచేశారు.

* * *

మదాసుమెయిల్ బండిని గుంటూరు మీదుగా మళ్ళించి నడపడానికి ఆలోచనలు సాగుతున్నాయని గుంటూరులో ఒక ప్రత్యేక బోగీని తగిలించే విషయం పరిశీలింపబడుతోందని రైల్వేల ఉపమంత్రి శ్రీ రామస్వామి చెప్పారు.

* *

కర్నూలుజిల్లా ఆర్.టి.సి బస్సులలో పనిచేస్తున్న దాదాపు 30 కండక్టరులను సస్పెండు చేసిన సందర్భములో స్థానిక ఐ.ఎన్.టి.యు.సి. అధ్యక్షుడు శ్రీ జె. లక్ష్మణసింగ్ ఠాకూర్ (మున్సిపల్ కౌన్సిలర్) డివిజనల్ కంట్రోలర్ శ్రీ రాజారాం దగ్గరకు రాయబారం వెళ్ళి సస్పెండు చేసిన కండక్టర్లకు ప్రథమ హెచ్చరిక చేసి తిరిగి వుద్యోగంలో చేర్చాలని కోరారు.

♦ ♦ ♦

రాష్ట్రాంతర రవాణాను పెంపొందించి ఆపరేటర్ల యిబ్బందులు తొలగించడానికి రాష్ట్ర ప్రభుత్వాలఅభ్యంతరాలకు హేతువయిన పన్ను మినహాయింపును సమగ్రపరుస్తూ రాష్ట్రాంతర రవాణాకు వుపయోగింపబడే మోటారుబండ్ల పన్నుకు ఆయా రాష్ట్రాలమధ్య పంపిణీకి వీలయిన విధముగా సింగిల్ పాయింటు పన్ను విధానాన్ని రూపొందించేందుకు యన్.పి మథుర్ గారి ప్రాతినిధ్యంతో ఒక కమిటీ పరిశీలనలు జరుపనున్నది.

dited, Printed and Published by J. Bhaskara Rao, Ravaana Samaachar, Congress Office Road, Vijayawada-2 and Printed at Graama Swarajya Press, Vijayawada-2
Wrapper Printed at Sri Sarada Press, Vijayawada-2.